శ్రీ శ్రీనివాసాయ నమః



# వివిధానంద గ్రంథమాల

# భక్తానందము

(ప్రథమసుమము)



గ్రంథకర్తలు శ్రీరామశ్యాములు.


శ్రీ శారదా ముద్రాక్షరశాల
చిత్తూరు.

1920.

వెల] [అణాలు ౦—౨—౦.

# విజ్ఞప్తి.

మహాశయులారా!

"వివిధానంద గ్రంథమాల" యను పేరఁ గొన్ని చిన్ని పొత్తంబుల వెలయింపఁదలపెట్టి యిది సాధ్యమాయంచు నెడఁద దిగులొందియు భాషాసేవగదా! యనుతృప్తిమైకొన నుడుత భక్తిందలంచి యీ "భక్తానందము"ను వెలిపఱుప సాహసించితిమి. ఇది ప్రథమప్రయత్నమగుటచేఁ దప్పులు మెండుగనుండును. అయిన నీ గ్రంథమును వ్రాయఁ బ్రోత్సహించిన మామిత్రమండలివలెనే, భాషాభిమానులెల్లరును మాయుద్యమమునకుఁ దోడ్పడి దోసఁగులఁ దెలిపినచోఁ గృతజ్ఞతతో నందుకొని పునర్ముద్రణమున సవరించి కొనఁగలము. ఇందు భగవద్ధ్యానాసక్తుల యుపయోగార్థ మేకవచన ప్రయోగము నిలిపియున్నాము.

ఇట్లు విన్నవించు,

బుధజనవిధేయులు,

శ్రీ రామశ్యాములు.

## ఉద్యమము.

ధీమంతుల్దలలూఁచిమెచ్చఁగ నబ్బ్రత్యాంధ్రదేశభాషావళిన్
ష్ఠేమాధిక్య పదప్రయుక్త రసభూతిం జెన్నునాంధ్రంబునన్
సామాన్యుల్లఘున పండితాళిగొనన సన్మిత్రవాంఛాప్తి, శ్రీ
రామశ్యాముల మేమొనర్చెదము సద్గ్రంథంబులశ్రాంతమున్॥

## అంకితము.

రామశ్యామలకోమలాంగ! నతపాత్రా! మంగళాకార! శ్రీ
రామశ్యాముల కుంభమోదివయియాంధ్రంబందుమాయిచ్చుప్ర
జ్ఞామేయప్రతిపాద్య పద్య వివిధానంద ప్రసూనంబులన్
ప్రేమన్మాల్యర్గొని తేర్చిప్రోవుకరుణన్ గృష్ణా!జగద్రక్షకా!

ఓం.

# శ్రీ శ్రీనివాసచరణౌ శరణమ్.

## భక్తానందము.

శా॥ శ్రీనాగాంగమలాలయుంగణపతిన్ శ్రీకంఠు దాక్షాయణిన్
నానాజీవవిధానుసారదనువిజ్ఞానప్రదీపాత్ములన్
శ్రీనాథాదికవీంద్రులన్ గురువులన్ జేమోడ్పుసంధించుమన్
గీనాశక్తియకావ్యసిద్ధిఁదలఁతున్ గృష్ణా! జగద్రక్షణా! ౧

శా॥ నీమీఁదన్ గృతిసెప్పలేనికవితల్ నీధ్యాసలు ల్లేనిదు
ప్రామాణ్యంబులు నీకథల్ వినని శ్రోత్రల్ నీగుణంబుల్ మదిన్
వేమాఱుల్ గణియింపలేనిమొఱకల్ నిక్కంబు గావ్యర్థముల్
ప్రేమన్ మానసభక్తిలేనివయునన్ గృష్ణా! జగద్రక్షణా! ౨

మ॥ నినుధ్యానింపమనంబు నిల్వదు నిను న్వీక్షింపబల్మాయతా
నిను సేవింపఁగశక్తిలేదశనము న్విష్టాప్తినీయఁబ్రబద
క్షుణముల్ సేయఁబ్రపంచగర్భుఁడవునీ సంతుష్టి "నేనే" రభ
క్తినినాచే సెడుకందనంబుఁగొనుమా కృష్ణా! జగద్రక్షణా! 3

మ॥ హరియంచున్ సురవైరిబాలుఁడు కృపన్ యాచింపరక్షించితౌ!
శరణంబన్న విభీషణుంబిలిచి రాజ్యంబేలఁగాఁజేసితౌ!
కరిమొఱ్ఱోయనఁగాచినావుగద సత్కారుణ్యమేపారనన్
గొరలంజూచెద వేమి న్యాయమిది? శ్రీకృష్ణా! జగద్రక్షణా! ౪

శా॥ నీలావణ్యమునీచరిత్రములువర్ణింపంగలేకుండవ్యా
ర్థాలాపంబులనాడుచుంటినవిసుంతైనన్ సహాయంబుగా
నీలోకంబును జూపఁజాలనివి హా నింగూర్చిచింతించివే
శేశకుండఁగనీకథల్ నుడువుదున్ గృష్ణా! జగద్రక్షణా! ౫

ఉదయంబస్తమయంప్రకాశదినము ఖ్యాంబోలిసర్వంబునీ
యాదరంబందుఁగుదిర్చికొంచు వెలికిన్ యోగ్యంబుగావీడుదౌఁ
గద! యీకార్యముకోసమైతికమతా కారంబు నైజంబునీ
కిదిసామాన్యప్రవృత్తియూఁదలఁపఁగాఁ గృష్ణాజగద్రక్షణా! ౬

శా॥ నీలోలోకములున్న యప్పులయము; న్నీవే వెలింజేయున
ద్దేలోకంబులసృష్టి; వేఁడుకలుగా వీక్షించు చేరక్షు; నా
బాలుండైవటపత్ర శాయివగుచున్ బ్రాపంచికద్రష్టవై
లీలామానుషవేషమూఁద నరుటల్ కృష్ణా! జగద్రక్షణా! ౭

మ॥ ఒకచోటన్ క్షణమైన నాఁగఁడలసూర్యుం డెప్పుడున్ వార్థియుం
చుకడైనఁదన మేరమీఱదు; వహించున్భూమి సర్వంబు; నో
పికవీచుం బవనుండు; మేఘములు నే వేళంజలంబిచ్చు; శౌ
రికృతంబద్దిర! చండశాసనములౌఁ! గృష్ణా! జగద్రక్షణా! ౮

శా॥ మచ్ఛంబై, కమఠంబు, సూకరమవై మానుష్యసింహంబవై
స్వేచ్ఛన్వామనుఁడై భృగుండవయిపృథ్వీశుండవై శిరివై
మ్లేచ్ఛారణ్యదవాగ్నికల్కివయి భూమిందుష్టసంహారివై
యిచ్ఛాలీలవిహారమందెదవు శ్రీ కృష్ణా! జగద్రక్షణా! ౯

మ॥ అవతారంబులు లెక్కలేవ వజహాసుల్ వ్యాపారముల్ "నేరమం"
చువచింపన్ బసివాఁడమూఢుఁడనుమం దుండన్ విశేషించిని
న్నవలోకించిమహద్విలాసములసానందంబుగా వ్రాసినీ
కివియర్పింపగనెంత? సన్నుతములే కృష్ణా! జగద్రక్షణా! ౧౦

మ॥ ఖరముల్కుంకుమపూవుమోసిననుద ద్గంధంపుసారస్యమా
ఖరముల్ నేరనియట్లు మండుకములున్ గంజంబులందుఁడిమా
ధురిమంగాననిరీతిమానసమ్మునం దుందేజమైమెప్పునీ
యిరవుంగాననివారిజన్మమువృథా కృష్ణా! జగద్రక్షణా! ౧౧

మ॥ ఒకఁడన్నంజగడాలగొండిసుతుఁడౌనొక్కండుముక్కోపియౌ,
నొకటందానెకులాలకుండగుటన త్యుద్దీప్తవాచాలక
ప్రకటాఖ్యన్సతినిన్ వహించనవివైరం బిల్లులేకుంటఁజా
వికమేలంచుశిరంబువీడెవిధియున్ గృష్ణా! జగద్రక్షణా! ౧౨

మ॥ చపలంబైనసిరిన్ జడంపుఁ బృథివిన్ శయ్యాఫణ్వజ ద్వేషమున్
దపనంబిచ్చుననంగుఁడౌసుతునిసంద్రంబందువాసంబునున్
ద్రపతో నీ బహువేషధారివయియిట్టి బాధన్నివర్తించుటల్
కృపణంబంచుఁదలంచిదారుమయిలో?కృష్ణా! జగద్రక్షణా! ౧౩

శా॥ భూపాలవ్రాతునివాహముం దినఁటసా మ్ముల్ పుత్రవాహంబుకే
శోషింపన్ హరిపుత్రుపైఁగవియవి ష్ణోద్భూతకాత్యాయనీ
ద్వేషంబున్ ధనదుండు మిత్రుఁడయితా దిక్పాలుఁడై శూలి మా
ర్వేషంబున్ ధరియించి రా విసమున్ గృష్ణా! జగద్రక్షకా! ౧౪

మ॥ మదిసంకల్పపరీక్షమాత్రమునని ర్మాణంబునన్ బోషయున్
వధయుం జేయుఘనుల్ త్రిమూర్తులెగ్రహవ్యాజ్యంబులం జిక్కి రాఁ
గదరా! గొంతెమకోర్కులైనఁ గొనసా గన్ జేయఁగావచ్చునీ
పృథివిన్ సంస్తుతివార్థినీఁద నెవఁడో? గృష్ణా! జగద్రక్షకా! ౧౫

మ॥ బలిభూనాథుఁడు ద్రోహమేమి తలఁచె న్బాహాటశౌర్యండు వా
లి లవం బేనపరాధమేమి సలిపెన్ లేశంబు రారాజునుం
బలమున్వారలపైని జూపితివిన న్బాధించుటల్వ్యాడనీ
కిలసామాన్యమె కాక వేరగునె? యో కృష్ణా! జగద్రక్షకా! ౧౬

మ॥ హరియన్నం బరమాత్ముడం ద్రుహరిభ క్తాగ్రేసరుల్గుద్ధులై
హరుడన్నం బరమేశుఁడం ద్రుఁహరభ క్తాగ్రేసరు ల్వీరులై
మతినా పైసిగపట్లఁ బేరమున మ ర్మంబిద్ది వైకుంఠుఁడున్
గిరిజాధీశ్వరుఁడొక్కఁడం చెఱుఁగరో కృష్ణా! జగద్రక్షకా! ౧౭

మ॥ హరియంచున్హరయంచు నెట్టులనినన్ యావన్మహాపాపముల్
పరిహారంబగునంచునమ్మిరొ మదలోఁ బల్మాఱునీనామమున్
స్థిరభక్తిన్భజియించు పుణ్యులనులా తింజూతు వేనీవు?ము
క్తిరయంబేదయ సేయుచుందువుగదా కృష్ణా! జగద్రక్షకా! ౧౮

మ॥ సరివారల్ నగుచుండ బంధువులు బ ల్చాకన్విలోకింపనొ
ప్పరికింపన్ హితులెల్లశాత్రవులుకో పాటోపుత్రైవిప్లవం
బరయంగా నరికట్లబాధ ఋణసం బంధుల్వగన్ జెంపవా
రిరసంబుల్ ఫలియింపఁ జేతువకటా కృష్ణా! జగద్రక్షకా! ౧౯

శా॥ ఆయుష్కాలమునూఱువత్సరములం దర్ధంబు రాత్రంబుతా
నాయర్ధంబునబాల్యమందుఁబదిరెం డబ్దంబులం గ్రీడలం
ద్రోయన్మిఁదటిపంచవింశతిగృహస్థుండై జరాభారధా
రేయుండై పసునైదు, శేమస్తుతికిం గృష్ణా! జగద్రక్షకా! ౨౦

మ॥ బాలుండైనపుడాటపాటలమునన్ బ్రార్థింపఁగాఁజాలు సం
శీలంబున్ మతియుంగనంబడదుగా సింజెందినం గాని నేఁ
బాలన్ జా! ధ్రువునంతనోముఁగనవి శ్వత్వాప్త! నీపాదముల్
రేలుంఘ్రసముఖుంచినమ్మితి నెదన్ గృష్ణా! జగద్రక్షణా! ౨౧
మ॥ కఫవాతంబులు గ్రమ్మి యంధబధిరాంగంబుల్ మఱిన్ సార్థకం
బుపలక్షింపనినున్ దలఁపనుదిలో గొణించునో! యెంచునో!
యపమిథ్యాస్తవీడునో మఱమనో యానాఁటికీనాఁడెనీ
కృపనొందఁగఁ దలంచి వేఁడితినహో! కృష్ణా! జగద్రక్షణా! ౨౨
మ॥ కష్టంబే ప్రతిరోజునం గలిగెడిం గాలానుకూలంబులై
నష్టంబే ప్రతికర్జమందొనరున న్యాయానురోధంబులై
కష్టంబెంచఁదగున్ ఫలంబు "నహి" నా కర్మంబెయిల్లొటచే
నిష్ఠాంగంబులనీవె పూర్ణకరుణన్ గృష్ణా! జగద్రక్షణా! ౨౩
మ॥ కనుఁగొంటిన్ సతిపుత్రబంధుగృహవర్గంబున్ ధనత్స్వర్ణగో
ధనధాన్యాదులు "నావి" "నావ"నుచు గాత్రంబుండునందాఁక నెం
తనియల్లాడినఁ గష్టదుఃఖములసంద్రంబైన సంసారదా
రిని గాన్పింపవు సౌఖ్యసంతసములో కృష్ణా! జగద్రక్షణా! ౨౪
మ॥ తనకెంతో విభవంబు గల్గినను జెంతం గానఁ గాఁవచ్చు భూ
మిని గొన్నన్ బహుభాగటంచు మఱినామీఁదన్ మదిన్నిల్పఁజా
లనియత్యాశకునంతులేదుతుదకే లబ్ధవ్య చేఁజిక్కదే
రిని సౌఖ్యంబునమంచునో తెలియమో కృష్ణా! జగద్రక్షణా! ౨౫
మ॥ జననంబందినదాదినే బహుళకష్టంబుల్ సహించెఁ గడస
జ్జనసంబంధము లేక దుష్టుఁడయిదుస్సాంగత్యమగ్నుండనై
జననింద్యుండనినన్ను దూఱుమనుడులా స్వాదించితెంతో విర
క్తినినీపాదములాశ్రయించితినహో కృష్ణా! జగద్రక్షణా! ౨౬
శా॥ ఔరా! యిచ్చితిపాంచభౌతికపుదేహంబింద్రియానీకమున్
బోరాటంబొనరింపలేకవశమై పోయెన్మనంబందులోన్
ఘోరాగ్నిన్ శలభంబువడ్డగతిలోఁ గుందంగఁ జేయించినీ
వీరీతిన్ గనినవ్వుచుంటతగునే కృష్ణా! జగద్రక్షణా! ౨౭

మ॥ తనువుల్ బుద్బుదముల్ కృతాంతునిభటుల్ దన్నీడ్చి కొంపోవుచోఁ
దనసంపాదనమింటనిల్చు సతిపుత్రాదుల్ స్మశానంబుదాఁ
కను సేగింతురు గాని మీఁదజములోఁ గయ్యంబు గావించి ము
క్తిని గావింపరు వారినమ్మ ఫలమే? కృష్ణా! జగద్రక్షణా! ౨౮

మ॥ పదినూర్లక్షలు కోట్లు గాధనము సంపాదించి క్షేత్రంబులన్
దుదినిర్మాణము చేసి పోవుతఱిఁ గూఁతుల్ కన్నపుత్రుల్ "పసుల్
గదినిర్మించకపోయె" "గుండెలములా కర్ణంబులందుండె మీ
రిదిమున్ జూడుఁ"డటంద్రు బాంధవులతోఁ గృష్ణా! జగద్రక్షణా! ౨౯

మ॥ సుతులే సద్గతిమార్గదర్శకులటంచుం బల్కు వాక్యంబులన్
మతియోచింపకు శుకుఁడు భీష్ముఁడు నసంతానంబునం గందిరే?
శతపుత్రుల్ కురురాడ్వశిష్ఠులను నుచ్ఛస్థానమందుంచిరే?
కృతకర్మంబులఁ గూర్చి పొందు దశలున్ గృష్ణా! జగద్రక్షణా! 3౦

మ॥ అభిమన్యాత్మజుఁడున్ శుకుండు మతిప్రహ్లాదుండు వైరోచనుం
డిభరాజుం భరతుండు మారుతియునున్ గృష్ణుఁడు భీష్మాదిస
ద్విబుధుల్ తొమ్మిది భక్తిమార్గములనిన్ వీక్షించి మోక్షస్థులై
రిభవత్పూర్ణకృపాకటాక్షమున శ్రీకృష్ణా! జగద్రక్షణా! 3౧

శా॥ చీము న్నెత్తురమేధ్యమూత్రక్రిమిసంశ్లేష్మాదిదుర్మాంససం
ఘామేయంబగు పాడుదేహమున దే వా! ద్వారముల్ తొమ్మిదం
డేమారించెడు చోరులాఱుగుఱు బుద్ధిం దోఁపిడింగొంచు న
న్నీ మాయన్ బడఁజూతురీ వెగతియో కృష్ణా! జగద్రక్షణా! 3౨

మ॥ విదురుం డిచ్చిన కూఁటినీళ్ళు ప్రియమై విందొప్ప భక్షించితే!
సదయుం జూచితి వుమ్మి సేయు ఫలముల్ సాపాడియా బోయతన్
ముదమే పారఁ గుచేలుఁ జూచితడుకుల్ ముట్టింప! మా గ్రంథమున్
వృథగా జూడకుమంకితంబు గొని శ్రీకృష్ణా! జగద్రక్షణా! 33

గద్య

ఇది శ్రీకోదండరామకృపోదయ కవితాభిరామ శ్రీరామశర్మ
ప్రణీతంబైన వివిధానంద గ్రంథమాలా ప్రథమసుమంబగు

భక్తానందము,

శ్రీకోదండరామార్పణమస్తు.

# సప్తద్వారగోపుర బంధకందము.

విధివినుత! ప్రధానా! ధాత్రీధవా! నందసుకుమార! దేవ! దరధరా! స
దయాంబోధి! రమావర! మధుసూదన! వినుతశీల! మహనీయగుణా!

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | వి | | | | | | |
| | | | | ను | వి | ధి | | | | | |
| | | | త! | ప్ర | ధా | నా! | ధా | | | | |
| | | కు | సు | ద | నం | వా! | ధ | త్రీ | | | |
| | మా | ర! | దే | వ! | ద | ర | ధ | రా! | స | | |
| మా | ధు | సూ | ర! | వ | మా | ర | ధి! | బో | యాం | ద | |
| న! | వి | ను | త | శీ | ల! | మ | హ | నీ | య | గు | ణా! |

